

# ఆలాపన
( కవితా సంపుటి )



రచన :
డా॥ (శ్రీమతి) వాసా ప్రభావతి M.A., Ph.D.
లెక్చరర్, వనితా మహా విద్యాలయము
ఎగ్జిబిషన్ గ్రౌండ్స్, హైదరాబాదు.

ప్రచురణ.
భావన ప్రచురణలు
చిక్కడపల్లి, హైదరాబాదు-500 020.

ప్రథమ ముద్రణ
జనవరి 1980.
ప్రతులు 1000
వెల : రూ 3/-

ముఖ చిత్రం : శివగురువులు



ముద్రణ
బాలాజి ఫైన్ ఆర్ట్సు ప్రింటర్సు
మునిసిపల్ కాలనీ,
మలకపేట, హైదరాబాదు-36.

ప్రతులకు
భావన ప్రచురణలు
1-8-248, చిక్కడపల్లి,
హైదరాబాదు-20

నవయుగ బుక్ హౌస్
సుల్తాన్ బజార్,
హైదరాబాదు.

# అంకితం

గుండె నిండా మమతలు
మాటలనిండా వెన్నముద్దలు
కళ్ళ నిండా ప్రేమ కాగడాలు నింపి
భారత స్వాతంత్ర్య సమరంలో
సర్వశక్తులా కృషిచేసి
మనవసేవే మాధవసేవగా భావించి
చివరి క్షణాల వరకు
దేశం కోసం పాటుపడి
నా జీవితంలో ఆరని
ఆశయాల జ్యోతులు వెలిగించి
స్వర్గానికి పయనమై వెళ్ళిన
నా తండ్రి
కాశీచయనుల సూర్యనారాయణ గారికి

# కృతజ్ఞతలు

నా కవితా సంపుటి 'ఆలాపన' కు అభిమానంతో అభిప్రాయాన్ని వ్రాసి నాకు కొండంత ఉత్సాహన్ని అందించిన ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవులు డా॥ దాశరథి గారికి, నాగురువులు డా॥ సి. నారాయణ రెడ్డి. డా॥ నాయని కృష్ణ కుమారి గార్లకు, ఆంధ్రప్రభ అసిస్టెంటు ఎడిటర్ ఎల్లోరా గారికి భావసా సంస్థ అధ్యక్షులు శ్రీ పి. ఎస్. ఆర్. ఆంజనేయ శాస్త్రి గారికి. జనరల్ సెక్రటరీ శ్రీ హరిశ్చంద్ర ప్రసాద్ గారికి ఎన్నో విధాల చేయూత నిచ్చిన ఆంధ్రభూమి అసిస్టెంటు ఎడిటర్ శ్రీ కనకాంబర రాజు గారికి, ప్రింటు చేసి యిచ్చిన బాలాజి ప్రింటర్స్ వారికి ముఖపత్ర చిత్రం వేసిన శివగురువులు గారికి పుస్తకంపూర్తి అయ్యేవరకూ సహకరించిన శారదాస్టుడియో రమేష్‌కి.

కొంత వరకు ఆర్థిక సహాయాన్ని అందించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి నాకృతజ్ఞతలు.

డా॥ వాసా ప్రభావతి

# భావన ఆలాపన

భావన చలన చిత్ర సంబంధ సంస్థ సాహిత్య సాంస్కృతిక వైజ్ఞానిక రంగాలకు కూడా తన కార్యకలాపాల్ని విస్తరిస్తూ యువతరంలో నవచైతన్యానికి జరుపుతున్న కృషిలో భావన ప్రచురణలు కూడా ఒక భాగం. భావన ప్రచురణల తొలిమొగ్గగా భావన ప్రధాన కార్యదర్శి శ్రీ హరిశ్చంద్రప్రసాదు వ్రాసిన ఫిలిం జర్నలిజం పరిశీలన వ్యాసాన్ని వెలువరించాం. మలి మొగ్గగా భావన మహిళా విభాగం ఉపాధ్యక్ష్యురాలు డా॥ వాసా ప్రభావతీ శాస్త్రి వ్రాసిన ఆలాపన కవితా ఖండికల్ని అందిస్తున్నాం. శ్రీమతి ప్రభావతి తెలుగు సాహిత్య రంగంలో విశేష కృషి చేసారు. ఆధునిక భావ సంపద కలవారు సామాజిక స్పృహతో కవితల్ని వెలువరించే లక్ష్యం ఉన్నవారు.

'ఆలాపన' ఇరవైనాలుగు కవితా ఖండికల సంపుటి. వీటిలో ముక్తచ్ఛందశైలి కనిపిస్తుంది. భావాలు ప్రభంజనంలా కాక మనోజనంలా ఈ కవితల్లో చోటుచేసుకొన్నాయి. ఉద్గ్రంథమో మహాకావ్యమో చక్కగా విరిసిన పుష్పమైతే ఇటువంటి ఖండికలన్నీ గుబాళించబోయే మొగ్గలు. మొగ్గల్ని మాలకట్టి భావన సంస్థ వీచబోయే సురభిళాలకు ప్రతీకగా నిలుపుతోంది. ''అక్షరాల గమ్మత్తుల' సంపుటీ కరణం. అనంత సాహిత్య గానార్ణవంలో ఏదో చిన్న 'ఆలాపన. ఆలాపనలోంచే మనోజ్ఞగాన ప్రజ్ఞ ప్రస్తావకముంది. శ్రీమతి ప్రభావతి తమ రచనల్ని భావన ప్రచురణలుగా అందచేస్తూ సంస్థ పట్ల తమ ప్రగాఢాదరణను వ్యక్తంచేసారు. ఆమె భవిష్యద్వాణికి భావన ఈ ప్రచురణ ద్వారా ఆలాపన పలుకుతోంది.

భావన సంస్థ తలపెట్టి ప్రతికార్యానికీ తోడునీడగా ఉంటూ అండదండలందజేస్తున్న సహృదయులందరికీ కృతజ్ఞతలు తెలుపుతూ మాలో ఒకరైన శ్రీమతి ప్రభావతీశాస్త్రి 'ఆలాపన' ఖండకృతుల్ని భావన ప్రచురణగా అందించడానికి ఆనందిస్తున్నాము.

పి. ఎస్. ఆర్. ఆంజనేయ శాస్త్రి.

భావన అధ్యక్షుడు.

# ప్రభావతి అక్షరాల ప్రభావం

డా॥ దాశరథి
ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి

చిన్నమాటల్లో ఎన్నెన్ని భావాలను వ్యక్తపరచవచ్చో తెలుసుకోవాలంటే కవయిత్రి ప్రభావతి "ఆలాపన" వినాలి.

అక్షరాలను అనుగుణంగా
అమర్చినప్పుడు
పుడుతుంది ఒక భావం, ఒక అర్థం.

అన్నారు ప్రభావతి గారు. భావంలో ప్రభావం వుంది.

అక్కడే వుంది అక్షరాల గమ్మత్తు అనికూడా అన్నారు. ఈ అక్షర ప్రపంచంలో ప్రణయ, ప్రళయాలు, పాత, క్రొత్తలు అన్నీవున్నాయి.

అందరు వాడే మాటలే ప్రభావతి వాడి కవితల్లో మనను ప్రభావితం చేస్తుంది. కవితా ప్రభావతి ఆమె.

పేక ముక్కల్లా ముందు వెనుకలు మారిస్తే
పుడుతుంది లోకంలో
ప్రేమ – ప్రణయం – విరహం, శోకం
అవే ముక్కల్ని తారుమారుచేస్తే
తాండవిస్తుంది ప్రళయం

అన్నారు ప్రభావతి ఈ అక్షరాల గమ్మత్తు, గమ్మత్తుకాదు, అక్షరాలా నిజం.

ఈ మధ్య అక్షరాలనూ అంకెలనూ కలిపి కాంక్రీట్ ఐయొసి అనే పేరుతో కవితలు అల్లుతున్నారు. పాశ్చాత్య ఆధునిక కవులు కొందరు. అవి చూడడానికి కసరత్తుగా గమ్మత్తుగావున్నా లోతులకు వెళితే హృదయాలు కవిత్వపు మత్తులో ఊగిపోతాయి.

ప్రభావతి కవితలో నాకు కనిపించింది సరళతతో పాటు తరళత.

ఈ సారళ్య, తారళ్యాలు ఆధునిక కవితను అంతంత మాత్రపు అక్షరాస్యుడైన పాఠకుడి వద్దకు సైతం తీసుకువెళ్ళి అలరిస్తాయి.

అదే ఈనాడు ఆధునిక కవి చేయవలసినపని కవిత ఈ యుగంలో కర్షక, కార్మికుల దాకా వెళ్ళాలి.

చిన్నమాటలో మిన్నగా చెప్పినప్పుడే అది సాధ్యపడుతుంది.

లోకాలను కలిపే శక్తి
అక్షరాలలో ఇమిడివుంది అన్నారు ప్రభావతి

అక్షరశక్తిని తెలుసుకొని ఆధునికంగా వ్రాస్తున్న సోదరి ప్రభావతిని అభినందిస్తున్నాను.

శ్రీరామనవమి — హైదరాబాదు.

# ప్రశస్తి

డా. సి. నారాయణరెడ్డి
ప్రొఫెసర్ ఉస్మానియా విశ్వవిద్యాలయం.

కొత్తగా కవిత్వం రాస్తున్న వాళ్ల కోవలు మూడు ఇది స్థూలంగా చేస్తున్న విభజన సుమా:

అనుభూతికి అక్షరాలు తొడిగి భావాల తీగలకు పూయించేవాళ్లు.

ఒక ఉగ్రవాదానికి కట్టుబడి ప్రతికవిత కొస మెరుపులో ఆవాదాన్ని తీవ్ర స్వరంలో వ్యక్తీకరించేవాళ్లు.

ప్రకృతినీ, ప్రగతినీ, కాలాన్నీ, లోకాన్నీ, మనిషినీ, మానసమూ— ఒకటేమిటి చూసిందీ, తోచిందీ కవితలుగా అల్లుకునే వాళ్లు.

మా పూర్వ విద్యార్థిని, ప్రస్తుతాధ్యాపకురాలు డా॥ వాసా ప్రభావతి చివరి కోవకు చెందింది. ఆవిడకు కొన్ని అభిప్రాయాలున్నాయి; కొన్ని సుమధుర భావాలున్నాయి. కొన్ని వైయుక్తికమైన అనుభవాలున్నాయి. వాటిని సరళ సరళంగా, తామరాకుమీది నీటి చుక్కల్లా తరళ తరళంగా అందించింది ఆలాపన గా.

ప్రకటించిన అభిప్రాయాలు కొన్ని.... .... మేఘంలా ఆవరించు / ఉరుములా గర్జించు / మెరుపులా సాగిపో .... .... లాంటివి కేవల ప్రబోధోక్తులుగా మిగిలిపోయినా

ఎక్కడ చూసినా / అక్షరాల గుత్తులు

కాగితాలపై / మరి కలాలపై .... .... అన్నప్పుడు ప్రభావతి లోని ప్రతిభామతి ప్రస్ఫుట మవుతుంటుంది.

అయితే ఈ అక్షరాల గుత్తుల్లాంటి కొత్త పదబంధాలు, మిరిమిట్లు గొలిపే బిరికత్తులాంటి ఊహాలు విస్తరిల్లితే డా॥ ప్రభావతి లోని కవయిత్రి మరింత రాణిస్తుంది. ఆ ధాతువులకు నేపథ్య రచన ఈ ఆలాపన.

డా॥ నాయని కృష్ణకుమారి
రీడర్ ఉస్మానియా యూనివర్సిటీ

చి॥సౌ॥ వాసా ప్రభావతిని నేనెఱుగుదును. ఈమె ప్రజ్ఞ కలిగిన యువతి, వాగ్మి, సాహిత్యాన్ని గురించీ సమాజాన్ని గురించి స్థిరాభిప్రాయాలను సంతరించుకొన్న మహిళ.

ప్రతి మనిషి
మరో మనిషికి ఒరవడి :
ప్రతి చేత
మరో చేతకు పునాది అనే

తత్త్వం మనసుకు పట్టించుకున్న మగువ. అందమైన మనస్సు, అందమైన చేత పెంచుకోవాలనే తపన కల ఆలోచనా పరురాలు నలుగురి మధ్యపుట్టి నలుగురి మధ్య నడుస్తున్నా మంచి చెడుల అవతలి గట్టును అందుకోవాలనే ఆరాటం అంతరంగంలో నింపుకున్న మహిళ. దుఃఖ సముద్రంలో కొట్టుకుపోతున్న జనాన్ని వలవేసి కాపాడాలనీ, విలకడ లేకుండా భోగాలు తూగుటుయ్యాలలో ఊగేజనాన్ని ఆపాలనీ, కులమతాలవల్ల పెరుగుతున్న అఖాతాల్ని పూడ్చేయాలనీ, అప్పటి వరకూ తన ఆయుష్షును పెంచుకోవాలనీ ఆరాటపడే అంతరంగం ఈ ..చిరంజీవిది...

ఏదో వింత ఆలాపన
ఏదో కొత్త సందేశం
ఎప్పుడు చూసినా
వెన్ను తట్టి లేపుతుండగా
అంతులేని ఆర్భాటాన్ని
అంతరంగంలో భరిస్తున్న — మనస్విని ప్రభావతి.

సమాజ పరమైన ఈమె తపన అక్షరమై, సాహిత్యమై, సాటి మనసుల్ని ప్రభావితం చేస్తుందని ఆశిస్తున్నాను.

ఈమె కలం చెక్కే కవితా చిత్రాలు ఆంధ్ర సాహిత్య రంగంలో ఒక స్థానాన్ని సంతరించుకోడానికి నిత్యపరిశ్రమ ఎంతోకావలసిన మాట నిజమే.

అయినా ప్రభావతి అలసటను దగ్గరకు రానీయని నిరంతర శ్రమా శక్తురాలు : గమ్యం చేరడంలో బద్ధ కంకణురాలు,

ఆమె చేపట్ట బోయే విజయం తెలుగు సాహిత్యానికో వెలుగు మొలక కావాలని ఆశిస్తూ.

ఆశీర్వదిస్తూ,
డా॥ నాయని కృష్ణకుమారి

# కవితాలాపన

ఎల్లోరా

(ఆంధ్రప్రభ అసిస్టెంటు ఎడిటర్.)

మారుతున్న సమాజ విలువలతోపాటు సాహిత్యపు విలువలూ మారడం సహజం,

మారేది మార్పించేదీ సాహిత్యం.

నాటినుంచి నేటి వరకూ సాహిత్య పరిణామ క్రమ వికాసంలో కవితా రంగంలో కవిత్వతత్త్వంలో పరిశీలనలూ, పరిశోధనలు చిగురించిన ప్రక్రియా మందారాలు.

ఛందోబద్ధ కవిత్వంనుంచి భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం దిగంబర పైగంబర కవితాధోరణులు విప్లవ కవితాతరంగాలు.

వచన కవిత, అందులో ఎన్నెన్ని కొత్తగాలులు. మరెన్ని కొత్తగొంతులు

ఈ రోజున ఎవరు వప్పుకున్నా, ఔనన్నా కాదన్నా వచన కవిత్వమహోద్యమం మూడు పూలూ ఆరు కాయలుగా విరిసి విప్పారింది.

కవిత్వం గుండెలను కుదపాలి.

కవిత్వం మనిషిని కదిలించాలి.

సమాజానికి కాంతిదివిటీగా, క్రాంతి పథానికి దిక్సూచిగా కవిత ఆవిర్భూతం కావాలి,

ఇక్కడ కవి మీద ఉన్న కర్తవ్యం విశ్వరూప సాక్షాత్కారంచేయడమే.

ఏసాహిత్య సృష్టి కానివ్వండి మనిషిని భయపెట్టేది కాకుండా మనసు నిండా ఆలోచనామృతం ఆవిష్కరించే మానవ ధర్మప్రబోధం కావాలి.

ప్రాచీన కవి పక్షిబాధకు తల్లడిల్లి శోకించి శ్లోకాన్ని వినిపించి ప్రబోధించి నట్లుగానే, ఆధునిక కవి సాటి మనిషి బాధలకీ, బరువులకీ బాధపడి కన్నీటిలోంచి విప్లవాత్మక కవితా కింకిణులను ప్రయోగించడం జరుగుతూంది.

కవికి కమిట్‌మెంటు అవసరమే. ఎందులో ఉత్తమ కవితాసృష్టిచేయడం లో, విశ్వ శ్రేయస్సాధనలో సమాజాన్ని ప్రగతి పథం పై పునడిపించే మహోద్యమ నిర్మాణంలో తనకూ కొంత బాధ్యతా కర్తవ్యం ఉందని గుర్తించడంలో.

ఆఆలోచన, ఆమార్పువలన కవితోద్యమంలో వచ్చింది కనుకనే తిలక్, దాశరధి, నారాయణ రెడ్డి, ఎల్లోరా, శేషేంద్ర, సోమసుందర్, విశ్వం

వంటి ఎందరో లబ్ధప్రతిష్ఠులు తమకవితాత్మకు ఉత్తమ కవితాసృష్టినే వాహికముగా మలచుకొని ఆవిష్కరించుకొన్నారు.

మరెందరో వచన కవితా ప్రక్రియలో చేంతాడు వచన కవితలే కాదని చిన్న చిన్న వచన కవితలను సమాజాన్ని వినిపిస్తూ ముందుకు సాగిపోతున్నారు

చిన్న కవితలతో కొందరు ఏకీభవించని వారూ, చాంతాడు కవితలను తూలనాడే వారు మరికొందరూ లేకపోలేదు.

కవితా విష్కరణానికి ఏ ఒక్కరి అడుగుజాడలూ అక్కరలేదనీ, ఏ ఒక్కరి గొంతునీ ఎరువు తెచ్చుకోనవసరంలేదని – తనదీ అన్న ఒకవాణి. ఒక బాణీ అలవరుచుకొని. తమ సాహితీనందనంలో కొత్తసొబగుల గులాబీలను పూయించాలనీ నా ఆశ – నా ఆశయం.

ఈ మధ్య వచన కవితోద్యమంలోకి ఎందరో అడుగుపెట్టిన వారున్నారు

శ్రీమతి వాసా ప్రభావతిగారు మంచి సాహిత్యాభిరుచి గలిగినవారు. ఆమె అప్పుడప్పుడూ అక్కడక్కడా తమ కవితలను వినిపించగా వినడం. ప్రచురించగా చదవడం జరిగింది. కాస్త పట్టుదలతో మరింత శ్రద్ధతో ఉత్తమ కవిత్వం రాస్తారని అనిపించింది.

నిజమయింది కూడా !

డా॥ ప్రభావతిగారు తనలో దాగిఉన్న ఆశయాలకు మాటలు నేర్పి సమాజాన్ని ప్రతి బింబిస్తూ ‹ఆలాపన‹ చేసారు.

అదే ఈచిన్న కవితాసంపుటికి నామకరణం,

మంచి భావాలు గల కవితకు మచ్చుగా కలం నాహలం అన్నదానిలో–

కలం నాహలం
ప్రకృతి నా పొలం
మధుర భావాలె ఎరువులు గజేసి
ఉత్సాహమె నీరుగ జల్ల
చేస్తా కృషి, పండిస్తా కవితలు
అందిస్తా మంచి మనసులకు.

అనడంలో ఎంతో ఉదాత్తభావం ఉంది.

ఇలా ఈ సంచికలో మంచి కవితల ఆలాపన మనకు వినిపిస్తుంది,

డా॥ వాసా ప్రభావతిగారు ఈ చిన్న సంపుటితో ఆగిపోక మరింత ఉత్తమోత్తమ కవితా మల్లెలతో తెలుగు సాహితీనందాన్ని ఆవిష్కరించాలని కోరుతున్నాను.

హైదరాబాదు
సాహితి–1980

# కలం నా హాలం

కలం నా హాలం
ప్రకృతి నా పొలం
మధుర భావాలె ఎరువులు గవేసి
ఉత్సాహామె నీరుగ జల్లి
చేస్తా కృషి
పండిస్తా కవితలు
అందిస్తా మంచి మనసులకు.    (ఆంధ్ర భూమి)

# ఆలాపన

ఏదో వింత ఆలాపన
ఏదో కొత్త సందేశం
ఎక్కడ చూసినా
ఎప్పుడు చూసినా
వెన్నుతట్టి లేపుతుంది.
ప్రతి మనిషిలో
అంతు లేని ఆర్భాటాన్ని
కలిగిస్తుంది.
ప్రతి మనిషి అడుగు జాడల్లో
అనిభవాల మొగ్గలు
రేకులు విప్పుకుంటాయి
ముందు అడుగుకు
సోపానాలై నిలుస్తాయి.
ప్రతి మనిషి కదలికలు
తర తరాల చరిత్ర పుటలను
తిరగేసి చూపుతాయి
ముందు కదలికకు
నాందియై నిలుస్తాయి,

ప్రతి మానవుని
ఊర్పుల రాపిళ్ళలో
పూర్వ పర సంధ్యారాగాలు
తళుక్కు మంటాయి
పదును పెట్టుకున్న
కొత్తరాగాలు ఖణేలు మంటాయి.
ప్రతి మానవుని
గుండె టకటకలలో
ధర్మా ధర్మ విచక్షణా
సంచలనం హోరుమంటుంది
గుండె లోతుకు
కొలత బద్దయై
నిలుస్తుంది.
ప్రతి మానవుని మేధస్సులో
తరతరాల జీవన పథాల
ఓడలు బొలువారుతాయి
తప్పొప్పుల పట్టికలు
తడికలు కట్టి నిలుస్తాయి.
జీవితపు విలువలుకు
అద్దం పట్టి చూపుతాయి.
ప్రతి మాటలో
రాగద్వేషాలు
పురులు విప్పి

నాట్యమాడుతాయి
మనసు గుట్టును
రచ్చ కెక్కిస్తాయి.
ప్రతి చూపు
పాత కొత్తల
సంకెళ్ళ గవాక్షాల నుండి
తొంగి చూస్తుంది
కొత్త చూపుకు
రూపం దిద్దుతుంది.
ప్రతి మనిషి
మనిషికి ఒరవడి
ప్రతి చేత
మరో చేతకు పునాది
అదే మానవ
మనుగడకు నాంది
అదే మానవ జీవనానికి
జీవంపోసే అమృత కలశం. (భారతి)

# ఆనవ్వే

ఎవరిదో ఆనవ్వు
ఎంతో సున్నితంగా
లయ తప్పకుండా
వినబడు తోంది.
అప్పుడే విరబూసిన గులాబీల
అందంలో దోబూచు లాడుతూ
అప్పుడప్పుడే విచ్చుకుంటున్న
తెల్లని మల్లెల సొగసుతో
సయ్యాట లాడుతూ
పాలబుగ్గల పశిపాప
బోసి నవ్వుతో
కేరింతాలు కొడుతూ
ఘుమఘుమ లాడుతూ
యమునా నదీ తీరంలో వినిపించే
వేణువునే మరపింప జేసి
నన్ను మత్తెక్కించి
మైమర పిస్తోంది.
నీరెండలో వెలిగే

ఆకాశపు అంచుల్లా
చీకటిలో వెలిగే దీపంలా
ఆనవ్వుకు
నాహృదయం పరవశించి
వెలిగి పోతుంది.
ఆనవ్వుల్లో ఏవో మెరపులు
ఆ మెరవుల్లో ఏదో అద్భుతశక్తి
ఆశక్తే నన్ను పట్టి బంధించి వేస్తుంది.
సూర్యుని చూసిన పద్మంలా
చంద్రుని జాడ తెలిసిన కలువలా
పరవసించి నాహృదయం
పున్నమి నాటి సముద్రంలా
ఉప్పొంగి పోతుంది.
ఏదో తీయని అనుభూతులు
నాలో చెలరేగి
నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తాయి
ఏవో మధుర భావాలు
నా చెవులకి సోకి
నన్ను మైమర పిస్తాయి
అప్పుడే తీయగా హాయిగా ఊహిస్తా
ఆవూహాలో నాకలం
ముందుకు సాగిపోతుంది.
అందుకే ఎప్పటికే
అనవ్వే కావాలి నాకు. (ఆంధ్రప్రభ)

# స్వేచ్ఛ

ఉరిమింది ఒక మబ్బు
మొలిచింది ఒక మొలక
కురిసింది ఒక జల్లు
పూసింది ఒక కొమ్మ
ఆకొమ్మ పై చేరింది
ఒక చిలుక.
పూలవాసనల ఒడిలో
చల్లగాలి కౌగిరిలో
పులకరించి ఆచిలక
పలికింది హాయిగా
పాడింది తీయగా
ఆ పాట మధురిమలో
పరవశించిన ఒక గోరింక
రివ్వు రివ్వున ఎగిరివచ్చి
పచ్చని కొమ్మ పై
చిలకమ్మ పజ్జ నె చేరింది.

8

నీకు నేతోడు గానిలిచానని
జంటగా హాయిగా బ్రతకాలని
కలిపింది శ్రుతి చిలకమ్మ పాటలో
మానవాళికి లేని స్వేచ్ఛా సుఖాలు
తన కున్నాయని
మురిసింది ఆచిలుక.



# కోయిలా పాడవే !

ఓ కొత్త కోయిలా
వసంతం వచ్చిందని
రెక్కలు కట్టుకు వాలావా!
అసలు ఆమని అందాలన్నీ నీవేగా!
అనువుగా పదును లోనున్న
అరుణ రంజిత అమ్ర కిసలయ రసములు
ఆవు రావురంటూ మెక్కి
గళానికి పదును పెట్టుకొని
నీ ఆనందాన్ని అందరికీ పంచాలని
గొంతెత్తి పిలుస్తున్నావా!
ఎద విప్పి పాడుతున్నావా?
అసలు నీ పిలుపును అందుకొనేదెవరో
నీపాట తీపిదనాన్ని పంచుకొనే దెవరో
నీకు తెలుసా ?
నీ పాటను అనుకరిస్తే
నువ్వు పంతాని కొచ్చి
కసరుకొనే

ఆటిన్నారి పిల్ల లెక్కడున్నారో
ఇప్పుడు నీకు తెలుసా?
మోయ లేని పుస్తకాల భారాన్ని
భుజాన్ని తగిలించి
మండు ఎండలో
ఆగని బస్సులకోసమై
ఎదురుచూసి చూసి
క్రిక్కిరిసిన బస్సులను
తట్టుకు వ్రేలాడుతున్నారు
గుండెలను చేత పట్టి
పయనిస్తున్నారు.
అందంగా నీ తో పలకాలవి వున్నా
నీ పిలుపును అందుకో లేరు వారు.
ఇక అద్దాల మేడలో
అందాల గదిలో
తప్పతాగిన మైకంలో
నీ పాట లోని మాధుర్యాలమ
హృదయానికి అద్దుకొనె దెవరు ?
నీ కోసం ఎదురు చూసె దెవరు ?
ఇక సామాన్య దంపతుల మాటంటావా ?
వీరు ఆ ప్రబంధ కాలపు
ప్రేయసీ ప్రియులుకారు.
పెండ్లి నాడె ఆఫీసులకు
రెక్కలు కట్టుకు ఎగిరే

విరహ పక్షులు వీరు.
అందుకే కోకిల గానాలు
చల్లని పిల్ల గాలులు
సరిపడవని తెలుసుకు ప్రకృతి
మాడ్చే ఎండలను
మలమల వేచే గాలులను
విసం తోస్తోంది
నోటి దగ్గర కూటిని
కొట్టుకు పోతోంది.
అందుకే వీరికి ప్రేమ-ప్రణయం-సుఖం
ఇలాటి పదాలకు అర్థాలు తెలుసుగాని
అనుభవంలో లేని
అమాయకులు వీరు
ఈ విధంగా ప్రకృతే ఎదురు తిరిగి
వికట్ట హాసం చేస్తుంటే
ఇవి చాలక
కక్షలు కట్టి కత్తులు దూసె దొకడు
కలంచేత పట్టి సంఘాన్ని కడిగే దొకడు
నోటికి పని చెప్పి సంఘాన్ని దులిపే దొకడు
చేతికి చిక్కింది దోచు కొనే దొకడు
అసలు ఒకరి మాటంటే ఒకరికి విషం
ఒకరి సుఖమె వీరి కసలు ఆటంకం,
అందుకే నీపాటను అందుకోలేరు వీరు.
అంతే కాదు

బ్రతుక నేర్చిన మనిషి
సామాన్యుని పై సవారి చేస్తుంటె
నలిగిపోయిన మనిషి
నోరుతెరిచి చూస్తున్నాడు
వేలు కదిపే శక్తి లేక ఆగిపోతున్నాడు
నీ పాట వినే ఓపిక లేక అలసిపోతున్నాడు
అందుకే ఓ కోయిలా
నీపాట అందరూ అందుకోలేదని
అలుక బూనకు
నీకై ఎదురు చూసె
సామాన్య గుండె లింకా
కొన్ని కొట్టు కొంటున్నాయి
నీపాటను అందుకునే
మనసు లింకా మెదలు తున్నాయి.
వారికోసమె నవ్వు పలకాలి
వారికోసమె నువ్వు పాడాలి
నీపాట పన్నీటి జల్లులు కురిపించి
ఎండిన వారి హృదయాలను
మొలకెత్తించాలి
మూగవోయిన వారి గళాలను
పలికించాలి.

# అక్షరాల గమ్మత్తు

అక్షరాలు_అక్షరాలు.
ఎటుచూసినా — ఎక్కడ చూసినా
అక్షరాల గుత్తులు.
కాగితాలపై - మరి కలాలపై
మేడలపై - గోడలపై
వస్త్రాలపై అణ్వస్త్రాలపై
అక్షరాలు - అక్షరాలు
అక్షరాలను అనుగుణంగా
అమర్చినప్పుడు
పుడుతుంది ఒక భావం ఒక అర్థం.
అదే భాషకు రూపం.
మరి అక్షరాలను తారుమారుచేస్తే
భాషకు భావం సున్నా
రూపం శూన్యం
అక్కడే ఉంది అక్షరాలగమ్మత్తు
పేక ముక్కల్లా ముందు వెనుకలు మారిస్తే
పుడుతుంది లోకంలో
ప్రేమ-ప్రణయం-విరహంశోకం.

మరవి తారు మారు చేస్తే
తాండవిస్తుంది ప్రళయం.
చేస్తుంది సింహగర్జన
తుపాకీ గుళ్ళు దూసుకు పోతాయి,
ఆటంబాంబులె పెళపెళ మంటాయి.
అక్షరాలు లెక్కకు కొన్నే.
మరి అందరి భాషో అనంతమైంది.
ఆకాశం ఎత్తున ఎదిగి
రోదసీ కుహరమె వ్యాపించి
సర్వ మానవులను కలిపే
కంఠ సూత్రమై నిలిచి పోతుంది.
వీణపై రాగాలు పలుకునట్లు
పిల్లన గ్రోవిపై పిల్లగాలి మ్రోగినట్లు
మానవాళి నాలుకలపై
పలుకుతాయి అక్షరాలు
సరిగమల సంగీతమై
అమృతాన్నే చిందించి
హృదయాలను పులకరింప జేయగలవు,
భయంకర నాదమై
గుండెలను పిండగలవు.
ఎవరు కాదన గలరీ సత్యాన్ని
అసలు దేనికున్నది.
లోకంలో ఇంతటి శక్తి
లోకాలను కలిపే శక్తి

మరిలోకాలను మింగే శక్తి
అంత అక్షరాలలో యిమిడి ఉంది.
మరి అదే అక్షరాల గమ్మత్తు. (విశ్వసాహితి)

# కాలచక్రం

రాత్రి పగలు
చీకటి వెలుగుల ప్రతి నిధులు
కష్ట సుఖాలకు
తల్లి తండ్రులు
రాత్రి ఆగదు
పగలు నిలువదు
కష్ట సుఃఖాలు
కలకాలం నిలువవు.
ఏడ్చేకన్నే నవ్వుతుంది
నవ్వే కన్నే ఏడుస్తుంది
ఇదే కాలచక్రం

# లోకం

వీచింది తెమ్మెర
కదిలింది రెమ్మ
నవ్వింది పువ్వు
ఘుమ్మంది సౌరభం
హాయంది లోకం.

(ఆంధ్రభూమి)

# స్వాగతం

పండుగ వస్తోందని
అందరికి తెలుసు
ఆ సంబరాన్ని పంచుకొనేది
కొందరే అని కొందరికి తెలుసు
మహిషాసురునివంటి
అసలైన రాక్షసులు
దేవతలవంటి
పిసలైన మానవులు
ఎందరున్నారో లోకంలో
ఎందరికి తెలుసు ?
అన్యాయాలు, అక్రమాలు
కాలసర్పాలై బుస్సలుకొడుతున్నా
ఉప్పెనలు. వరదలు
అతివృష్టులు, అనావృష్టులు
పిశాచాల్లా పీక్కుతింటున్నా
పగిలిన ఎదతో
విరిగిన మనస్సుతో
మానవుడు కుమిలిపోతున్నా

ఆశ అతనికి ఊపిరి నిస్తోంది
ఆశే కరదీపమైన మనిషి
ప్రయత్నమే ఊపిరైన మనిషి
పట్టుదలే ప్రాణమైన మనిషి
ఓ దసరా పండుగా
నీకోసం ఎదురుచూస్తున్నాడు
కాళివై భద్రకాళివై
దుర్గవై కనకదుర్గవై
కదలివస్తావని
అందరిని ఆదుకుంటావని
పలుకుతున్నాడు నీకు
స్వాగతం
సుస్వాగతం

(ఆంధ్రప్రభ)

# పౌష్యలక్ష్మి

పౌష్యలక్ష్మి వస్తోందని
ప్రకృతి పులకించి
పచ్చదనం పందిళ్ళువేయగా
పరుగు పరుగున వస్తోంది
పగల సెగలతో
రగిలిపోయే మనిషికి
చల్లని మంచుదుప్పట కప్పి
చల్లబరచాలని
చకచక చేరుకుంటోంది
మమతలొట్టిపోయి
మందకొడైపోయిన
మానవ జీవితాలలో
ఆశల జెండాలు పాతాలని
చురుకుగా సాగుతున్న
పగటికాంతిని వెంటబెట్టుకొని
పరవసించిపోతూ వస్తోంది
ఆరని ఆకలిమంటలు
ఆకాశం ఎత్తునలేచే

అభాగ్యుల కుక్షులునింపాలని
సంచులనిండా పంటలు
వెంటబెట్టుకుని
సంబరపడుతూ
పౌష్యలక్ష్మి
పరుగు పరుగున వస్తోంది
మనసున్న మానవుల్లారా
మూటలుకట్టిన
మమతలు విప్పండి
పౌష్యలక్ష్మిని పలకరించండి
వచ్చుదనం వెచ్చగా కప్పుకోండి (ఆంధ్రప్రభ)

# అంతరం



విధి వక్రించి వీడక
మనిషిపై సవారిచేస్తుంటే
మోయలేని మనిషి
నేలకు ఒరిగిపోతాడు
అది చూసి
ద్వేషాన్ని దాచుకోలేక
పొట్ట చెక్కలయ్యేలా నవ్వేదొకడు
చూస్తే చుట్టబెట్టుకుంటుందని
కాలికి బుద్ధిచెప్పి స్వార్థంతో
కదిలిపోయేడొకడు
ఏమి చెయ్యలేక నిలబడి
అయ్యోపాపం అనే
అసమర్ధుడొకడు
అందరికి నేనున్నానని
చేయూతనిచ్చే
ఉదారుడొకడు
ఇదే గుండెకు
గుండెకు మధ్యదూరం
ఇదే మనిషికి మనిషికి
మధ్య అంతరం

# తెలిసిన నిజం

అంతా వొక్కటే
మనుషులంతా వొక్కటే
అందరికి తెలుసు యీ నిజం
మనిషి మనసులో
చీకటి తెరలు విచ్చుకున్నాయని
భయపడిన ఆ నిజం
తలదాచుకోడానికి తావులేక
ఎక్కడికో వెడలిపోతోంది
దిక్కులేక అల్లాడిపోతోంది
గాడాంధకార నిసీధిలో
తరిమివేయబడిన
వెలుగు రేఖలు
మరి వెనుతిరిగి చూడలేక
ఏ కొండలను అండగా చేసుకున్నాయొ
ఏ సంద్రాన్ని శరణు వేడాయో
కాని
తూర్పు వాకిలి తెరవగానె
ముసి ముసి నవ్వులతో

తుర్రున పరుగెత్తుకొచ్చి
లోకానికి వెలుగునిస్తాయి
మరి ఆ వెలుగును
కళ్ళున్నా చూడలేని
నిజాన్ని పోగొట్టుకున్న మనిషి
పక్కదారి పట్టి
చీకటిలో పోతున్నాడు.
స్వార్థపు ఎడారిలో
పయనిస్తున్నాడు
ద్వేషపు టిసుకలో
కూరుకుపోతున్నాడు.
అందుకే ఆకళ్ళు తెరిపించాలంటే
విద్యా దేవత వారిని ఆవహించాలి
సంస్కారపు జల్లులు కురిపించాలి
విజ్ఞాన గంధం పూయాలి
చీకటి తెరలు తొలగించాలి
అప్పుడే పారిపోయిన నిజం
పరుగెత్తుకొచ్చి వారి
హృదయాలలో నిలుస్తుంది,
అప్పుడే తెలుసుకుంటాడు
అంతా ఒక్కటే అన్న నిజం

## తోడు

మేఘంలా ఆవరించు
ఉరుములా గర్జించు
మెరుపులా సాగిపో
పిడుగులా అదరుపాటున పడు
మనసులేని గుండెలో నిద్రించు
మనసున్న మనిషికి
తోడుగా నిలు

## ఉగాది

నవ వసంతోదయం
నవ వత్సర ప్రారంభం
కొత్త పాతల సమ్మేళనం
అందరికి పరమానందం
బొండు మల్లెల సువాసనలు
గండు కోయిల పిలుపులు
మానవులకు ఆహ్లాదాలు
వేప పూల చేదు ఘుమ ఘుమలు
కొత్త చింత పండు పులుపు పొగరులు
మామిడి పిందెల వగరు జోరులు

కొత్త చెరకు బెల్లపు తీపి హొయలు
కలిపి రంగరించిన ఉగాది పచ్చడి
నాలిక తడుపుతుంది
జీవిత సత్యాలను
జ్ఞప్తికి తెప్పిస్తుంది
పవిత్ర దేవాలయంలో
పరమ భక్తులచే గంటల నినాదాలు
నిద్రాణమైన మానవాళికి మేలుకొలుపులు
పురోహితుడు పంచాంగం చేతపట్టి
చదువుతాడు జాతక ఫలాలు
నష్టాలకు లబో దిబోలు
లాభాలకు కుప్పి గంతులు
లాభ నష్టాలను
కష్ట సుఖాలకు లేక్కించక
మానవుడు గుండెనిండా
వెలుగు నింపుకొని
ముందుకు సాగాలి
ఆ వెలుగు రేఖల్లో
నూత్యవత్సరం హాయిగా సాగిపోవాలి

# మనిషి ఆవేశం

మనిషిలో ఎన్నో ఆలోచనలున్నా
కాలసర్పంలాంటి ఆవేశం ముందు
తల లొంచుతాయి
ఆలోచనలు పెరిగి
మనిషి మేధావి అయినా
ఆవేశం పెరిగిన క్షణం
మనిషి పశువవ్వు తాడు
అందుకే
ఆవేశం జయించాలి
ఆలోచనలు పెంచాలి
అప్పుడే మనిషి
ఋషి అవుతాడు
లోకానికి వెలుగు నిస్తాడు

# ఉదయం

తిమిరాన్ని తరిమి కొట్టి
మేధస్సును మేల్కొలిపి
చేత వానికి చేయూతనిచ్చే
లోకభాంధవుడు
లోకంలో అడుగు పెట్టిన సమయం
లోకానికి ఉదయం,
సంకుచితానికి సమాధి కట్టి
అనానయాన్ని పూడ్చి పెట్టి
అక్రమాలకు కత్తెరలు వేసి
కష్టపడే వాని కడుపులు నిండే
సమయం
దేశానికి ఉదయం

# చైతన్యం

చావు పుట్టు కల
సంధ్యా చీకట్లలో
పాత కొత్తల సమ్మేళనం
పాతరీత కొత్త మోజు
అయినా
పాత అనుభవాల కవ్యాలు
కొత్త పనితానానికి
నగిషీలు దిద్దాలు
పాత జీతకాల
నగ్న సత్యాలు
కొత్త జాతకాలకు
కవచాలు తొడగాలి
పాతకానిదే కొత్తలేదు
అయినా
చిలుముపట్టిన
పాత దనాన్ని
కొత్త రంపాలు చిత్రిక పట్టాలి
పాత బాటలో
మొలిచిన ముళ్ళ గుబ్బలు
కొత్త నాగళ్ళు దున్నివేయాలి
పాత రోజుల్లో

బుస్సలు కొట్టిన
కాల నాగుల విషపు కోరలు
కొత్త హత్తులు
పెరికి వెయ్యాలి
అప్పుడే కొత్త దనం
నవ నవలాడుతుంది
కొండ వాగులా జాలువారి
మానవ హృదయాలను
ముంచెత్తుతుంది
అప్పుడే మనిషి చలించి
ముందుకు సాగుతాడు
అనుకున్నది సాధిస్తాడు
అదే ప్రగతి పథం
అదే చైతన్య రథం

# అందం విలువ

అందంగా వుండాలని
అందరికి అందమైన
ఆలోచన ఉంది
అసలు అందమంటే
అయిష్ట మెవరికీ
అందంగా వున్నదాన్ని
చూడగానె మనస్సు
ఆవిరియై పోయి
నోరూరి నీరు కారుతుంది
అందాన్ని పొందాలని
మన సొంతం చేసుకోవాలని
అందరికి ఉంది ఉబాలాటం
అందుకే ఆందరూ
అందమైన వస్తువులను
నిర్మించి యింటి నిండా
నింపుకుంటారు.
కళ్ళతో చూసి మురిసిపోతారు,
అందమైన మల్లె
మనిషి చేత పడితే
మాడిపోతుందని తెలుసు

అందమైన గాజు బొమ్మ
నేలపడితే పగులుతుందని తెలుసు
అందమైన పడగలో
విషముంటుందని తెలుసు
అందమైన బుద్బుదానికి
జీవిత ప్రాయము
అందమైన తరగ లోరు
గుండెదాటు తుందని తెలుసు
అయినా అందాన్ని
కోరుకుంటాము.
అందాన్ని పెంచుకుంటాము
పై అందముతో పాటు
అందమైన మనసు
అందమైన మాట
అందమైన చేత పెంచుకుంచే
అందు అందంగా నిలిచి
అందరికి ఆధారమవుతుంది
అదే అందానికి
అందమైన విలువ.

# మానవత

లోకమంతా
మసగ వెలుగు
మతం వేసింది.
గుండెలో చీకటి
గూడు కట్టింది.
కంటికి దోషం
చుట్టుకుంది.
చేతలో చురుకు
తేచి పోయింది.
మమతలో తీపి
మాసిపోయింది
మాటలో నిజం
పిడాకులిచ్చింది.
ఆలోచనలో
కత్తులు దూస్తున్నాయి
మనిషికి మనిషికి
మద్య దూరం పెరుగుతోంది.
సంకెళ్ళ పడ్డ మానవత

మండే గుండెలో
తల దాచుకుంది.
ఏనాటి కైన
మండే గుండెలు
రగలక మానవు
సమాజంలోని కుళ్ళును
కాల్చక వదలవు
ఎప్పటికైనా మానవత
మిలమిల మెరవక
ఆగదు

# మనసున్న జీవాలు

చీకటిలో శయనించిన పగలు
కళ్ళు తెరచి వెలుగు చీరను కట్టి
లోకంలో అడుగు పెట్టక మునుపే
మాటలు రాని మనసున్న సంఘజీవాలు
బద్ధక మెరుగని సుబుద్ధులు
అండ జీలు మేల్కొంచి
కోటి రాగాలతో కలకలారావం చేస్తు
లోకాన్ని తట్టి లేపుతాయి
నడవ కాళ్ళు లేని
పలుక మాటరాని
తోటి వనాలను నమ్మి
కళ్ళు తెరవని పసికూనలకు
గుండె నిబ్బరంతో గూళ్ళలో వదిలి
ఆకలి పొట్టలు చేత పట్టి
తోటి జీవులలో తిండి కై పయనిస్తాయి
రేపటి చింతలేదు

ఉన్నదానికి ఊపిరి పోసుకుంటూ
కడుపులు నింపుకుంటాయి
పుక్కిట పట్టిన దాన్ని కగుచుకొని
కాలంమించ కుండా గూటికి తిరిగి వచ్చి
చిన్నారి పిల్లల నోటి కందించి
తనివి తీరాచూసు కుంటూ
ఎగురుట వచ్చేవరకు
రెక్కల మాటున దాచుకుంటాయి.
కోపాలు, తాపాలు, ద్వేషాలు లేని జీవులవి.
కనబడిన పడియల నీళ్ళు త్రాగి
దొరికిన తిండితో కడుపులు నింపు కుంటాయి.
అందుకే కాల ప్రవాహంలో కష్టాలు
సమస్యలు చట్టాలు లేవు
కాని అంతులేని క్రమశిక్షణ
తోటి పక్షులతో కలిసి మెలసి పోవమనసు ఉంది
అందుకే అన్నీ తెలుసుకున్న
మానవుడందు కోలేని
అంత ఎత్తున ఎగురుతున్నాయి
హాయిగా మనుగడ సాగిస్తున్నాయి.

# కాళరాత్రి

అది అర్థ రాత్రి
నాకది కాళరాత్రి
నాపాలిట యమరాత్రి
ఆ రాత్రి
విధి కోపించింది నాపై
చేసింది సింహ గర్జన
యమపాశం చేతపట్టి
నాపై ఉరికింది
ప్రళయం తాండ వించి నట్టు
ప్రపంచం మునిగి నట్టు
భయంలో ఆ క్రోశించాను
రక్షించమని మొర్ర లెత్తాను,
ఒక్కరూ ముందుకు రాకపోగా
ఒంటరినై అల్లాడిపోయాను.
నాగుండె జారిపోగా
శరీరం పట్టుతప్పి

గజగజ లాడిపోయింది.
కాలుముందుకు వేశేశక్తిలేక
పారిపోయే ఓపికలేక
పట్టుబడి పోయాను.
అమాంతం నన్ను పట్టినది.
యమపాశం నాకాళ్ళకు తగిలించి
గట్టిగా బిగించి ముడివేసింది.
కదప కాళ్ళు రాక
ఎదిరించే శక్తి లేక
బాధ పడే ఓపిక లేక
నాగుండె మెలికలు తిరిగిపోగా
నాకళ్ళు కన్నీటి ధారలెకురిసాయి
జాలిలేదు విధికి
గుండె బండరాయి విధికి
అని నిందించి నిందించి
నా నోరు పడిపోగా
నీరు కారి కారి నాకళ్లు ఎండిపోగా
ఇక ఏడ్చే ఓపిక లేక
నేలపై ఒరిగి పోయాను
అదిచూచి సహించలేని ధైర్యం
నా వెన్ను తట్టి లేపింది.
కళ్ళు విప్పిచూసి ఆలోచించాను.
ఇంత కన్న విధి సనే . మి చేయగలదు
కళ్ళ లేక పోయినా చేతులున్నాయి నాకు
మనసు మూగబోయవా

ఆలోచనలున్నాయి దానికి అనుకున్నాను.
విధికి ఎదురై నిలచాను.
మందుల బాణాలు వేశాను.
చీకటి విధిని, ప్రళయ రాక్షసిని
తరిమివేశాను
కాళ్ళపాశాన్ని తెంపేశాను.
జీవిత యాత్రలో వెలుగురాగకమానదు
జీకటి తొలగక తప్పదు
ధైర్యమే మానవునకు జయం
అని అప్పుడే తెలుసుకున్నాను,

# మనిషి

నలుగురి మధ్య
పుట్టిన మనిషిని నేను
నలుగురి మధ్యలో
నడుస్తున్న మనిషిని నేను
కష్ట సుఖాలను
ఉగ్గుపాలలో రంగ రించి
కడుపులో దాచుకున్న
మనిషిని నేను
మంచి చెడ్డల అవతల గట్టు లను
అందుకోవాలని ఆరాట పడే
మనిషిని నేను.
అందుకనే
మనిషి ఎంత ఎత్తుకు
ఎదిగాడో చూస్తున్నా
చంద్రమండలాన్ని
అధిష్ఠించడం చూస్తున్న
నవగ్రహాలను
చుట్టుముట్టడం చూస్తున్నా
అంత రిక్ష రహస్యాలను

చిత్రించడం చూస్తున్నా
పాతాళాన్ని దొలచి
పరిశీలించడం చూస్తున్నా.
మరి అంతేనా
అదిగ మించే మనిషికి
రెక్కలు విరిచేయడం చూస్తున్నా
పాతాళంలోని మనిషిని
పైకి రాకుండా అప్పళించడం చూస్తున్నా
ఎదుటి వారిని పీక్కు తినే
రాబందులను చూస్తున్నా
పాలు పోసి పెంచితే
కాటు వేసె కాలనాగులను చూస్తున్నా
మరి అందరికి అండగా వుండే
అందమైన గుండెలను చూస్తున్నా
మరి అన్నిచూస్తున్న నేను
ఉక్కిరి బిక్కిరియై
బిక్కుబిక్కుమని చూస్తుంటె
నామనస్సు ఝరీ వేగాని మించి
ముందుకు సాగులోంది.
అన్ని రకాల మనస్సులను
కలిపి ముంచెత్తాలని
ఉరకలు వేస్తోంది.
అందుకే
దుఃఖ సంద్రంలో కొట్టుకు పోతున్న

జనాన్ని వలవేసి కాపాడాలని వుంది.
నీకల భోగాల తూగుటుయ్యాలలో
నిలకడ లేకుండా ఊగె
జనాన్ని పట్టి ఆపాలని వుంది.
కులమతాల మధ్య పెరుగుతున్న
సంద్రాన్ని పూడ్చెయ్యాలని వుంది,
పేద ధనిక మధ్య రేగుతున్న మంటల్ని
ఆర్పేయాలని వుంది
మంచి చెడుల సంధికి
రాయబారం చెయ్యాలని వుంది.
అప్పటి వరకు కునుకు పట్టకుండా
కృషి చెయ్యాలని వుంది.
అంత వరకు నా ఆయుష్షు
పెంచుకోవాలని వుంది.

# అనంత ప్రకృతి

ప్రకృతి తెరపై
మానవు డొక చిత్రం
మానవ జీవనంలో ప్రకృతి ఒక
అగమ్య గోచర దృశ్యం.
ప్రకృతి పంతే మానవుడు
మానవ జీవనయాత్రకు
సూత్రధారే ప్రకృతి
మానవునకు ప్రత్యేకత మేధస్సు
దానిని మించి ఉంది మనస్సు.
ప్రకృతి అందాన్ని పొందేశక్తి
మానవ మనస్సున కుంది,
ప్రకృతిని పరిశీలించే శక్తి
మేధస్సున కుంది.
లేని
ప్రకృతి అంతరాత్మను దర్శించేశక్తి
మానవునకు నాస్తి.
అందుకే
తన ఆఖరి నిట్టూర్పును పట్టి
ఆపలేకపోతున్నాడు.
దాని గమ్యమేదో అసలే
తెలుసుకోలేక పోతున్నాడు.

పంచభూతాల ఉనికిని తెలుసుకున్నాడు
నవగ్రహాల శక్తిని పరీక్షించాడు
కాని
ఎప్పుడు ఏ శక్తి ప్రకోపించి
మానవునిపై పడుతుందో
తెలుసుకో లేక పోతున్నాడు.
పంచభూతాల వునికి తెలిసిన
అవిరాకాసిలా వచ్చి పీకలునులిమి
భీభత్సం చేస్తుంటే
ఆపే శక్తిలేక అల్లాడిపోతున్నాడు
అడ్డు పెట్టే శక్తిలేక బలైపోతున్నాడు.
అందుకే
ఈ ప్రకృతినిగూర్చి
మానవునకు తెలిసింది కొంత
తెలుసుకో వలసింది అనంతం.

# అందాల గోదావరి

గోదావరి అందాలను
చూడాలని నామనస్సు తహతహలాడింది
పాదాలకు పనిచెప్పి
తీరానికి చేరాను.
చలన చిత్రాన్ని మించిన
విచిత్ర జీవన చిత్రాలెన్నిటినో
నా కళ్ళు ఫొటోలు తీశాయి
నా హృదయాబ్ధిపై
ప్రాణ ప్రదంగా ముద్రించాయి.
అరుణోదయంలో అలవాటుగా
పాచుకొనె రవితీరాలు
ఎత్తైన తరగలహస్తాలను నిమురాతుంటే
ఆ మెరుపుల సోగులను ఏ కలం వ్రాయగలదు.
ఏ నోరు గుక్క తిప్పి చెప్పగలదు.
మిలమిల మెరిసే
సువిశాల సైకతస్థలులు
విశ్రాంతికై ఏతెంచిన దేవతలకు
పరచిన పట్టుపరుపుల్లా మెరిసిపోతుంటే
చుట్టచుట్టి పట్టుకు పోవాలనిపించింది.
నా ఎదనిండా పరుచుకోవాలని పించింది.
సుదూరాలనుండి ఎగసి పడుతూ వచ్చె తెమ్మరకులుకులు

తనివి తీరా తరగలను హత్తుకొని
చక్కిలి గింతలు పెడితే
నిలువెల్లా పులకించి
తలలూపుతూ ఎగిసిపడే తరంగల సొగసులు
నాగ కన్యల పడగలతో పోటీలు పడుతుంటె
ఆ అందాలను ఏ హస్తం అందుకోగలదు
ఆ చందాలను ఏ మనసు నింపుకోగలదు
నీటిని కొలచే అండజాలు బారులుతీరి
కిన్నెరలను మరిపిస్తూ
గోదావరి తల్లికి సుప్రభాత గీతిని ఆలపిస్తుంటే
పాడె నీరు మైమరచి శ్రుతులు కలిపితే
ఆశ్రవణేంద్రియ సుఖాన్ని
ఏ చెవులు నింపుకోగలవు.
ఆ మధుర భావాలను ఏమనసు నిలుపగలదు.
తెల్లని తెరచాపలతో
నట్టేటిలో నావలు
మేలు ముసుగు దాల్చిన
జలకన్యల్లా సాగిపోతుంటే
ఆ సొగసుల రాసులను ఏకళ్ళు దాచుకోగలవు
ఆ అందాల గుట్టలను మడిచి
ఏ గుండె నింపుకోగలదు
అందుకే గోదావరి

సుందర దృశ్యాలను నాయదలో
పదిలంగా దాచుకున్నాను
అందుకే గోదావరి జీవనరాగాల
అనుభవాలను కోటిరాగాలను
ఆలపిస్తుంటాను.